The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

తూప్రుబజారు, హైదరాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

| | | |
|---|---|---|
| సం॥చందారూ ౬-౦-౦<br>అర్థ ,, ,, ౩-౦-౦<br>విడి ప్రతిక ౦-౧-౦ | **GOLKONDA PATRIKA**<br>HYDERABAD, Dn. THURSDAY 7-6-1934 | ప్రాతపత్రికకు<br>వెల ప్రత్యేకము |

103451

సంపుటము ౬ } శా.శ.౧౮౫౬ శ్రీ భావనామ సం॥ నిజవైశాఖ బ॥ ౧౧ గురువారము ౨-౯-౧౩౪౩ఫ. { సంచిక ౬




### హైద్రాబాదు హరిజనసేవకసంఘమును గూర్చిన అపోహలు

—

మ. రా. రా. గోల్కొండ పత్రికా సంపాదకుని సన్నిధికి —

అయ్యా,

రహ్‌బరెదక్కన్ పత్రికలో హయిద్రాబాదు హరిజన సేవకసంఘమునుగూర్చి ప్రకటించబడిన దక్కన్ న్యూస్ ఏజన్సీవార్తను నేను చూచినాను

గాంధిమహాత్ముని అగమన సందర్భమున ఏర్పడిన ఆహ్వాన సంఘము యొక్క కార్యదర్శిపై గావింపబడిన ఆరోపణలకు నేనిప్పుడు సమాధానము చెప్పదలచుకొనలేదు ఏలనన గా, తమ విషయమై ప్రజలలో ఏర్పడిన పొరపాటు అభిప్రాయములను తీసివేయుటకు ఆ ఆహ్వానసంఘముయొక్క అధ్యక్ష, కార్యదర్శులకే బాధ్యత గలదు కాబట్టి నా ఈవిషయమున సమాధాన మిత్తురని నాకు నమ్మకముగలదు.

అయినను హయిద్రాబాదు హరిజన సేవకసంఘము రద్దుచేయబడునను వార్తను నేను ఖండించగోరుచున్నాను. హయిద్రాబాదు హరిజనసేవ సంఘము యొక్క చట్టమునందును కార్యక్రమమందును కొన్నిమార్పులు చేయవలయునని దెహిలీలో కేంద్రసంఘమువారు సూచించిరి ఆసూచన ననుసరించి హైద్రాబాదు సంఘము తాత్కాలికముగా పనిచేయక ఆపియుంచబడినది అంతమాత్రమే కాబట్టి ప్రజలు నదరు సంఘము ఎత్తివేయబడినదని తలచుట పొరపాటు.

హైద్రాబాదు హరిజన సేవకసంఘముయొక్క క్రొత్త అధికారులను నామినేటుచేయు విషయమున కేంద్రసంఘ అధ్యక్షుడగు జీ. డి. బిర్లాగారియొక్కయు, గాంధి మహాత్ముని యొక్కయు నిర్ణయమునకై ఎదురుచూచుచున్నామని ఎ. వి. ఠక్కరు గారు వ్రాసియున్నారు

బస్వంతరావు
కార్యదర్శి
హైద్రాబాదు హరిజనసేవకసంఘము

—

## ప్రజాహిత సమితివారి సేవ

—

మ. రా. రా. శ్రీ గోల్కొండ పత్రికాధిపతిగారికి. —

ఖమ్మము తాలూకా కోదుమూరుగ్రామములో రెండుమూడు సంవత్సరములక్రింద స్థాపింపబడిన ఈ సంఘమువారు వెనుకబడియున్న నిజామురాష్ట్రములో నిజముకొరకు, — అందును ముఖ్యముగా ఖమ్మముతాలూకా వారికొరకు — మంచి సేవ చేయుచున్నారని నాప్రయాణ సందర్భమున గనియున్నాను. వారిచేయుచున్న పనులలో ఒకటి ఈక్రింద చూపుచున్నాను

ఖమ్మములోనున్న సబు రిజిస్ట్రారుగారి దస్తావేజులు రిజిష్టరు చేయించుటకొరకు గ్రామములనుండి రైతులు, వర్తకులు, ఇతరులు వచ్చుచుందురు. వారికి దస్తావేజులు రిజిష్టరు చేయించుకొనుటయందు కొన్నిశ్రమలు జరుగుచుండెనట ముఖ్యమగుశ్రమలు ఉద్యోగస్థుల ధనాశయని తెలియుచున్నది. రిజిస్టరీఫీజు ఎంతో అంతవ్యయము అగుచుండెనట. డబ్బు పుట్టని యీకష్టదినములలో యీసంభావనయిచ్చుట చాలకష్టమగుచున్నదట. నిరక్షరులు నోరు లేనివారునగు గ్రామస్థుల యిట్టివ్యయముల పాలుగాకుండ ప్రజాహిత సమితి కార్యదర్శిగారు, అట్టి రైతులవెంట రిజిస్ట్రారుగారి ఆఫీసుకు పోయి అధికారులనడిగి ప్రభుత్వమైన ఖర్చుల ఎంతో అంతయే యిప్పించి దస్తావేజుల రిజిస్టరీ చేయించుటయందు తోడ్పడుచున్నారని తెలిసినది. క్రొత్తఆచారము లిచ్చుటకైన కష్టము వీరికనేకదా అంగీకరింపబడును? సాధారణముగా జనులు పూర్వాచార పరాయణులే యైయుందురు. అందులోను స్వలాభము ఉన్నచో పూర్వాచారమును వదలిపెట్టుట కష్టాతికష్టము! అట్లయినను ప్రజాహిత సమితివారి కృషివలన ఇటీవల ఎందరో రైతులకు వృథా వ్యయముతప్పినదని రైతులలో జనులు ప్రశంసా పూర్వకముగా చెప్పినారు. పరదేశియుడనైన నేను యీసంగతులవిని చాలసంతసించితిని. ఇట్టి సమితులు ఎన్నియోని యీరాజ్యమున అవసరమని తెలిసినది.

మరియొకసంగతి. యీరాజ్యమున తెలుగు జిల్లాలో తెలుగుభాషలో దస్తావేజు వ్రాసితెచ్చిన రిజిష్టరీచేయరట! ఆటివిరిలో దానితో ఉర్దూభాషలో తర్జుమా జతపరచ వలెన యునట! గ్రామరైతులు ఉర్దూవిదుతెలుసును తెలుగులో ఒకటి యుండిగా తర్జుమాలో మరియొకటియున్నచో వ్యష్టము భరించువారెవరు? బీహారుఇండియాలోని తెలుగుదేశములో ఈలాంటినిర్బంధములేదు. ఎంతగొప్పదస్తావేజుఅయినా మేము తెలుగులో వ్రాసి రిజిస్టరు చేయించుకుంటూ ఉంటాము. అక్కడి మారాజభాష ఇంగ్లీషు. కాని ఇంగ్లీషు తర్జుమా పెట్టమని మారిజిస్ట్రారులు కోరరు. తెలుగులోనే దస్తావేజు రిజిష్టరు చేసేపద్ధతి నిజామురాజ్యములో ఎందుకు పెట్టలేదో తెలియదు. రైలుబండిలో నేనీప్రశ్న ఒకరినడుగగా, ఇక్కడి రిజిస్ట్రారులు మహమ్మదీయులు కనుక వారికి తెలుగురాదని సమాధానము చెప్పినారు. కాని నేనన్నదేమి రాక యేమిచేసుందని తురకలకు తెలుగువచ్చియున్న వారు ఎందరోవున్నారు. జనులసుఖము యొక్క ప్రధానముకదా. తెలుగువచ్చిన వారినే రిజిస్ట్రారులుగా ఏల పెట్టకూడదు? లేదు మహమ్మదీయులకే ఈయుద్యోగము ఇయ్యవలెనంటే వారు తెలుగునేర్చుకొనువారుగా నియమించవలయునుకదా. దస్తావేజు వ్రాసినవానికి దస్తావేజు వ్రాసి వినిపించితే వానికి అర్థముకాకపోతే ఆదస్తావేజువలన ఏమి యుండగలదు? మహాఘనతవహించిన నిజాము ప్రభువరేణ్యులు దయామయులని వింటాను. వారి ప్రధానమంత్రి చాల గొప్ప ఉదారస్వభావులని తెలిసినది. అటివిరిలో బ్రిటిషు ఆంధ్రదేశములోని ప్రజలకుగల సర్వసామాన్యమైన హక్కును వీరికి యిచ్చుటకు ప్రభుత్వమువారు అభ్యంతరపెట్టరు. యీవిషయములో జనులు మహజరు పెట్టుకొంటే మంచిది.

ప్రజాహిత సమితివారు ఇట్టి మహజరును తయారుచేయించి సర్కారువారికి పంపించుకొన్నచో [illegible] తెనుగు దస్తావేజులు రిజస్టరీ కావచ్చునని ఆశపడగలదేమో. మొత్తముమీద ఈ సమితివారి సేవకు వందనశతము.

ఒక బాటసారి

—

### పురపాలక యెన్నికలు: కేంద్ర సంఘమువారి కర్తవ్యము

—

మ. రా. శ్రీ. గోలకొండ పత్రికాధిపతిగారి సముఖమునకు,

అయ్యా,

ఇదివరకు తమ పత్రికారాజమునందు వివిధ సంచికలలో నగర పౌరులలో కొందరు — బహుశా వారాంధ్రులేయై యుందురు — రాబోవు పురపాలకసంఘపు యెన్నికలలో ఆంధ్రులపక్షమున నెవ్వరును అభ్యర్థులుగా నుండవలయును విచారము వెలిబుచ్చుచు, ఆంధ్రుల ప్రాతినిధ్యావశ్యకతను చాటిరి. కాని నేటివరకును వార్తాపత్రికలందు ఆంధ్రుల ప్రాతినిధ్యము వహించునట్టి యే ప్రముఖుడును పురపాలక సంఘాభ్యర్థిగా నిలిచినట్లు ప్రకటింపబడలేదు.

ఇప్పుడీలేఖయందు ఆంధ్రుల ప్రాముఖ్యతను, వారియందుగల ప్రముఖుల నామధేయములను పేర్కొని వారిని అభ్యర్థులుగా నిలచుటకు కోరుట నాయుద్దేశ్యముగాదు. ఒకరిద్దరాంధ్రులును అభ్యర్థులుగా నిలువనున్నారని వినియున్నాను. వారి నామధేయములను ప్రతి ఆంధ్రప్రముఖునికిని చిరపరిచితమేయైయుండును వార్తాపత్రికలందు ఇదివరకు వారిపేరు బహిరంగపరుపబడకున్న కారణమున నేను వారిపేరు వెల్లడించుటధర్మముగాదు. కాని నిజాంరాష్ట్రాంధ్రుల శ్రేయాభివృద్ధులకై చిరకాలమునుండియు, పాటుబడుచున్న ఆంధ్రజన కేంద్రసంఘ కార్యకర్తలీవిషయమున శ్రద్ధబూనుటకు కోరుట నావిధియై యున్నది.

నేడు ఆంధ్రుల ప్రాతినిధ్యభారమును వహించునట్టి సంస్థ యొకటియే గలదనియు, అది ఆంధ్రజన కేంద్రసంఘమేననియు అందరెరిగిన విషయమే. ఈ సంఘ కార్యకర్తలు ప్రస్తుతపు యెన్నికలందు తోడ్పడకుండ యేమియు తెలుసుకొనక ఉదాసీనత వహించియుండుటచే నగరవాసులు పొరపాటులకు లోనగుచున్నారు నిజాం రాష్ట్రమునందలి జనాభాయందు అష్టభాగము నాక్రమించుకొనియున్న యీయాంధ్రులు ప్రభుత్వ ప్రజా సమ్మిళితమునట్టియు, స్థానిక స్వపరిపాలనముననుపద్ధమనసొపానమగునట్టియు నీస్వత్వమును వదలుకొనుట వారిబుద్ధిమాంద్యమని పలువురు అపహాస్య మొనర్చుటకు వీలుండును. ఈవిషయమునందు పట్టభద్ర సంఘమువారు గావించుచున్న ప్రయత్నములు గౌరవనీయములే, వారిబాధ్యతను వారు గుర్తించియున్నట్లు విదితమగుచున్నది. అనుభవజ్ఞులును, ఆదర్శప్రాయులునునగు ఆంధ్రజన కేంద్రసంఘ కార్యకర్తలు యికనైనను జాగ్రతపడుట మంచిది. నేడు పురపాలక సంఘముల యెన్నికలకు బహిరంగసభలను నిరోధించునట్టి ౧౬౩ (?) గష్టీ వర్తించకుండునట్లు చేయుటకు ప్రభుత్వమువారిని ప్రతివారును వాంఛించుచున్నారు బహుశా ప్రభుత్వమువారు త్వరలోనే దీనిని కార్యరూపమున దాల్చునట్లు చేయుచుండవచ్చును. అప్పుడు ప్రచారమునకుగూడ కష్టముండదు. కావున ఆంధ్రజన కేంద్ర సంఘ కార్యదర్శిగారు యెన్నికభారమును తామును పూనుకొనినట్లును ప్రకటించి ఆంధ్రులందు కలిగిన యుపోహను పోగొట్టుటకు త్వరలో ప్రకటనను గావించెదరని విశ్వాసము గలదు.

"ఆంధ్రుడు"

—

### మెదడు వెన్నెముకజ్వరము

—

మ. రా. శ్రీ గోల్కొండ పత్రికా సంపాదకుని సన్నిధికి —

అయ్యా,

కొన్నివారములక్రింద హైద్రాబాదులో ప్రారంభమైన మెదడు వెన్నెముకజ్వరము అదృష్టవశమున ఈసంస్థానములో ఎక్కువగా వ్యాపించలేదు గత మూడునెలలలోను ఆజ్వరము ౧౫ మందికిమాత్రమే తగిలియున్నది. ఇందులో మేనెల ప్రారంభమునుండి ఆజ్వరము తగిలినవారిసంఖ్య ౨ కాబట్టి ఆ జ్వరము ప్రబలినున్నదను కారణముతో ఇంకను ఎక్కువ తీవ్రమైనట్టి ఆటంకముల నేర్పరచవలయునని కోరుటలో కొన్ని స్థానికపత్రికలు వెలిబుచ్చిన భయమునకు తగినంత కారణములేదు. ఇప్పుడు సినిమాలను, బహిరంగసభలను ఆటంకపరుచవలసినదని సూచించుటకును తగినంత ఆధారములేదు. అభయమునకు బదులు స్ఫోటకమువలన కలుగుచున్న నష్టములనుగూర్చి ప్రజలును పత్రికలును ఎక్కువశ్రద్ధయమును చూపవలసియున్నది. పోయిన మూడునెలలలోను ఈస్ఫోటకమువలన ౨౫౪౪ మందికి తగులగా ౧౧౯౩ మంది మరణించిరి. కాబట్టి టీకాలు వేయించుకొనవలసినదని గట్టిప్రచారము చేసినచో ప్రజలకు ఎక్కువలాభము కలదు. అయినను దురదృష్టవశమున ఈచిన్న మంచియందు జాగ్రత్త పడకపోవుటను చాలామంది ప్రజలుయింకా ఆయిష్టపడుచున్నారు. అందువల్ల ప్రజలనుస్ఫోటకపు టీకాలను వేసికొనునట్లు ప్రేరేపించుటకుగల అవసరమునుగూర్చి ఎంతదూరము చెప్పినను ఎక్కువగాదు

అధ్యక్షుడు
స. ఖు. వి. ప్రభుత్వవార్తాలయము

—

## చందాదారులకు

ఈక్రింది నంబర్లుగల చందాదారులకు వి. పి. లను పంపుచున్నాము.

చందాదారుల సౌకర్యమునకై రు 7-0-0 లకు బదులు రు 6-0-0 లున్ను 12 పేజీలకుబదులు 16 పేజీలున్ను ఏర్పాటుచేయుటను గమనించి చందాధనమునంపి వి. పి. లను త్రిప్పకొందురుగాక యని మనవి.

ప్రత్యుత్తరము వ్రాయగోరువారు చందానంబరు వేసి వ్రాయుదురుగాక.

8-9-21-25-32-35-43-48-53-54-61-62-63-65-66-68-69-72-75-76-78-80-82-84-85-86-88-89-95-97-99-103-104-106-107-108-114-120-125-138-159-170-175-177-197-213-217-222-236-248-249-246-216-262-276-324-303-466-497-500-503-504-508-516-519-525-530-545-546-547-31-74-77-79-88-87-90-91-98-100-109-113-123-129-131-132-139-143-145-180-182-183-185-306-404-327-375-413-429-436-488-495-496-499-498-507-511-528-558.

---


గోలకొండ పత్రిక

శ్రీభావనామ సంII నిజ వైశాఖ బII ౧౦

గురువారము


## పంటల తగ్గించవలెనా?

రేపు శుక్రవారమునాడు సిమ్లాలో ఇండియాలో వివిధరాష్ట్రప్రభుత్వముల ప్రతినిధులును కూడి పంటల ప్లానింగువిషయమై ఆలోచనలు ప్రారంభించగలరు. మొదట వీరు ముఖ్యముగా గోధుమలను, వరినిగూర్చి ఆలోచించెదరు. ఏఏ విషయములను ముఖ్యముగా ఆలోచించవలసినదియు సూచనలను చేయుచు వ్యవసాయ పరిశోధన సంబంధమైన సామ్రాజ్య సంఘము (ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్‌రీసర్చి) వారు కొన్ని రోజులక్రిందట నొక ప్రకటన చేసియున్నారు. వారి అభిప్రాయములో మనదేశమందు వరిపంటను తగ్గించి దానికిబదులు మరియొక మంచి ఆహారయోగ్యమైన పంటను పండించుట మంచిది అని తోచుచున్నది. అసలు పంటల ప్లానింగు అనగానే ఏవోకొన్ని పంటలనుతగ్గించి మరికొన్ని పంటలను హెచ్చించుట యగును. ఏపంటలను తగ్గించవలసినది అను విషయమున 'ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫు అగ్రికల్చరల్‌రీసర్చి' వారి సూచనాభిప్రాయము మనదేశముయొక్క ప్రజలకు ఆమోదకరము కాజాలదు.

ఇపుడు ఇండియాలో వరిపంటను తగ్గించవలసిన అవసరమేమి? వరిధాన్యమునకు ధర అపరిమితముగా పడిపోయినందువలన రైతు నష్టపడుచున్నాడు, పంటను తగ్గించినచో దానిధర హెచ్చును అనునది ఒకటేగదా కారణము. ఈధర పడిపోవుటకు కారణమేమో సరిగా నిర్ణయించిననేగాని పొరపాటునకు తావు లేకుండపోదు. ఇదివరకు యితరదేశములనుండి బియ్యమును తెప్పించుకొనుచుండిన మలయా, సిలోను, డచ్ ఈస్టుఇండీస్, జపాను దేశములు యిప్పుడు తమకు అవసరమైన వరిపంటను తామే స్వయముగా పండించుకొనుచున్నవి కాబట్టి మనదేశపుపంట మన అవసరములకంటె హెచ్చై దానిధర తగ్గినది. ఈ అభిప్రాయముతో పలువురు ఏకీభవించరు. ఇండియాకు సయాము, బర్మాలనుండికూడ బియ్యము దిగుమతియగుచుండుటకు అవకాశమున్నపుడు మనదేశములో వరిపంట అవసరమునకు చాలినంత పండింపబడుచున్నదని చెప్పుటయెట్లు? గత ౫ సంవత్సరములలో బర్మానుండి పదిలక్షల టన్నులకంటె పైగా బియ్యము దిగుమతి చేయబడియుండెను. వాస్తవముగా కూడ ఇండియాలో వరిపంటను ఎక్కువచేయుటకు ఇంకను ఎక్కువ అవకాశము గలదు.

వరిపంట ధరతగ్గుటకు అవసరమైనదానికంటె ఎక్కువగా పండించబడుట కారణముగా నుండవచ్చునుగాని యీ మితిమీరినపంట యిండియాలోనని చెప్పజాలము. స్పష్టముగా ఇతరదేశములలోనని చెప్పవచ్చును. జపాను, కొరియా, ఫార్మోసాలలో యిపుడు వరివేయబడు విస్తీర్ణములో నూటికి ౧౦ ఎకరముల వంతున తగ్గింపుచేయుటకు ఆలోచనలు జరుగుచున్నవనుట ఇందుకు ఉదాహరణము కాజాలదా? ఈమధ్యకొంతకాలమునుండి సయాము దేశమునుండి బియ్యము విశేషముగా మద్రాసుకు దిగుమతి చేయబడుచున్నవి. ఆదేశమునకు మనదేశమునుండి ఎగుమతులు పూర్తిగా తగ్గిపోయియున్నపుడు, అవి మనదేశమునకు వేలకొలది టన్నుల బియ్యము దిగుమతి చేయుచున్నవనగా—మితిమీరినపంట ఎక్కడనున్నదో సులువుగా ఊహించవచ్చును.

మనదేశములో మితిమీరిన వరిపంటగలదని రుజువు చేయబడకపోయినను వరిపంటనుతగ్గించి దానిస్థానమున ఇంకొకపంటను వేయు విషయము ఆలోచించ తగినదేయని సూచింపబడినది. అట్టి ఆలోచన నష్టకరమైన ప్రయాసగానున్న దానిని వదలుకొనుటయే మంచిది. మనకు కావలసిన భోజనపదార్థములకు కూడ మనము యితరదేశములపై ఆధారపడుట—ఎంత బాగున్నది! మనదేశమునుండి పూర్వము బియ్యమును తెప్పించుకొనుచుండిన దేశములు యిపుడు మానినది ఈమాత్రము ఆలోచనలేకయేనా? పోనీ ఒకవేళ ఇతరదేశములే మనకు బియ్యమునుపంపును, మనము దానిస్థానమున మరికొన్నింటిని ఉత్పత్తిచేసి ఆదేశములకు పంపవచ్చుననుకొందము. ఇదిగాచిన మరికొంత కాలమునకు ఆదేశములు ఈక్రొత్త పంటల విషయమునను [illegible] మనదేశమునుండి దిగుమతి చేయుట ప్రారంభించినచో మనగతియేమి? ఈప్రకారముచేయుట వలన మనదేశమందలి వ్యవసాయము- దానితోటి రైతులునష్టకష్టముల పాలుకాగలరు.

మనము మన వరిపంటను కాపాడుటకు యిప్పుడు ముఖ్యముగా చేయవలసినపని యితరదేశములనుండి తత్సంబంధములగు దిగుమతులను నిషేధించుట. ఈవిధముగ చేసినచో కొంతకాలమునకు యితరదేశములే తమపంటను తగ్గించుకొనగలవు. ప్రస్తుత పరిస్థితులలో మన వరిపంటను తగ్గించుటవలన దానిధర హెచ్చునన్నను అది కోరదగినదికాదు. మన చేతిలోనుండు ఆహారమును పోగొట్టుకొని మాపాయలు ఎక్కువ చేసికొనిన ఆ మాపాయలను తిందుమా? కాబట్టి దేశీయులకు వరికంటె ఎక్కువ అనుకూలమైన, ఆరోగ్యకరమైన, పుష్టికరమైన క్రొత్త ఆహారసంబంధమగుపంట ఊహింపబడి ప్రజామోదమును బడసినప్పటికిని తప్ప, యిపుడు మనదేశపు వరిపంటను తగ్గించు విషయమై ఆలోచింప నవసరములేదు.

## విదేశవార్తలు

### మరల అయుధవిసర్జనసభ వాయిదా

అయుధవిసర్జనసభ చరిత్ర యుద్ధభీతిగలిగియుండు వాయిదాల వ్యవహారమే. ఒకప్పుడును అయుధవిసర్జన విషయమున అందరికిని సమ్మతమగు పరిష్కారము కుదురదు. అంతకుపూర్వము వాయిదా వేయబడినదై ఈసభ మొన్న మే [illegible] వ తేదిని మరల సమావేశమైనది. అది మొదలుకొని జూను ౫ వ తేదివరకు సభ్యుల కంఠశోషతప్ప గణింపదగిన ఫలితము పొందియుండలేదు. అధ్యక్షుడు అయిన హెండర్సనుగారు సభ ప్రారంభించునప్పుడు ఓడిపోలేదని చెప్పుకొనుచుండవలసిన పనిలేదని చెప్పినవారు ఇపుడు జూను ౫ వ తేదినాడు ముందు మంచిపరిస్థితులు కనబడునంతవరకు వాయిదావేయుటయే తాత్పర్యముగా గల తీర్మానమును స్వయముగా ప్రతిపాదించినారు. సభలో ముఖ్యమైన భేదము బ్రిటిషు ప్రభుత్వ ప్రతినిధికిని ఫ్రెంచి ప్రభుత్వ ప్రతినిధికిని మధ్య నున్నది. ఫ్రెంచి వారు తమరాజ్యముయొక్క క్షేమమునకు తగినంత ఆయుధసేనలను ఉంచుకొనుటకు తమ కధికారముండవలెనందురు. బ్రిటిషువారు అయుధవిసర్జనను ప్రధానముగా నెంచవలెగాని క్షేమమేమిటియందురు, ఏరీతివరకు ఏవిధముగా అయుధములను సేనలను తగ్గించవలెనను విషయములో రెండు మూలసూత్ర భేదముల వల్ల ఒకరిసూచనలకు ఇంకొక సూచనలకు పొత్తు కుదురుటలేదు. రష్యను ప్రభుత్వ ప్రతినిధి, స్విట్జర్లండు ప్రభుత్వ ప్రతినిధి, యింకను యితరప్రభుత్వ ప్రతినిధులు మధ్యవర్తిత్వపు సూచనలవలె చేసినారు. పెద్దపెద్దవారికి వివాదములలో ఈ చిన్నవారి సూచనలు పరిష్కారము చేయగలవా! అయుధవిసర్జనసభ మరియొకసారి వాయిదా తప్పదనియు నమ్మవచ్చును.

---

### పెరుగ్వే బొలివియాల వివాదము

పెరుగ్వేదేశ ప్రభుత్వమునకును బొలివియాదేశ ప్రభుత్వమునకును గల వివాదము పరిష్కారమునకై జాతిసమితియొక్క కౌన్సిలు (లీగ్ ఆఫ్ నేషన్సు కౌన్సిలు) కు దాఖలు చేయబడినది. బొలివియా ఈతీర్పునకు దాఖలుచేసినది. పెరుగ్వేకూడ సమ్మతించినది. లీగుకౌన్సిలు అప్పీలును విచారించుటకు తీర్మానించినది.

---

### సార్ వివాద పరిష్కారము

జర్మనీకిని ఫ్రాంసునకు సార్ రాష్ట్ర విషయమున వివాదమేర్పడియుండెనో అది సడలినది. రెండుదేశములకును సమ్మతమైనట్టి పరిష్కారమును జాతిసమితి కౌన్సిలు ఆమోదించెను.

---

### యుద్ధపు అప్పులవాయిదా

బ్రిటిషు ప్రభుత్వమువారు విరోపా మహాసంగ్రామములో అమెరికా ప్రభుత్వమునుండి అప్పుతెచ్చియుండిరి. జర్మని, ఫ్రాంసు, ఇటలీదేశముల ప్రభుత్వములుకూడ అప్పులను తెచ్చియుండెను. ఆఅప్పుతీర్చుటకు ప్రతి సంవత్సరము వాయిదాలు చెల్లించవలసియున్నది. గత సంవత్సరము బ్రిటిషు ప్రభుత్వము సకాలమునకు చెల్లించియుండెను. కాని యిపుడు యుద్ధఋణములనుగూర్చి అమెరికాతో ఏదోఒక తగిన పరిష్కారము కుదురువరకు వాయిదాను చెల్లించుట కిష్టపడుటలేదు. పరిష్కారమేలయనగా, బ్రిటిషుప్రభుత్వమునకు ఇతర దేశములనుండి రావలసిన బాకీలెన్నిరో వచ్చుటలేదు మరి తాను తనఅప్పుల నెట్లుతీర్చగలదు? మేము వాయిదాను చెల్లించవలసినచో ముందుగామేము మాకు బాకీలుపడియుండిన వారిని నిర్బంధించవలసియుండును. ఇదివరకు ఒకసారి అట్లు నిర్బంధించుట చేతనేగదా! అదికమునకు ఉపద్రవపడినది మరల అట్లుచేయుటచే ఆదేశపరిస్థితులు దిగజారిపోవును. కాబట్టి అదుపుతప్పించుటకుగాను, అన్ని ప్రభుత్వములకును యుద్ధఋణములవిషయమున తగినపరిష్కారము కుదురునంతవరకు మేము వాయిదాను ఆపియుంచెదము. అని బ్రిటిషువారు అమెరికాకు తెల్పినారు. ఈ జవాబు అమెరికాకు జూను ౫ వ తేది ముట్టెను. అమెరికావారు తాము తమవాయిదా ముట్టవలెనని ఎందుకునిర్బంధించుచున్నారో కారణము అమెరికా ప్రభువగు రూజ్వెల్టుగారు జూను ౧ వ తేదినాడు అమెరికా శాసనసభకు పంపిన సందేశములోగలదు. ఆ [illegible] ధనమును నష్టకరమైన అయుధములకు [illegible] దలగువాటిలో వ్యయము చేయుచున్నవి. [illegible] చేసినచో అప్పుతీర్చుటకు తప్పక [illegible] గలదు. అని [illegible] [illegible]

అల్ యిండియా కాంగ్రెసు కమిటీసాంఘిక పరిష్కారము ను (కమ్యూనల్ అవార్డు) పూర్తిగా త్రోసివేయనిచో రాబోవు ఎన్నికలలో ప్రత్యేకముగా పోటీచేయుటకు బెంగాలు రాష్ట్ర హిందూమహాసభ నిర్ణయించుకొన్నది.

---

జూను రెండవతేదినాడు రాత్రులు. ఖుల్నా, సైట్రా కోనా, అగర్తల, సిల్హెటులలో భూకంపము తాకినట్లు వార్తలు వచ్చినవి. అయితే జననష్టముగాని ద్రవ్య నష్టముగాని లేదు.

---

## జార్జిసార్వభౌముని జన్మదినోత్సవములో టపాసా ప్రేలుడు భయము

జూను ౪ వ జార్జిసార్వభౌముని జన్మదినోత్సవము ఇండియాలో అనేక పట్టణములలో చక్కగా జరుపబడినది. సిమ్లాలో వైస్రాయిగారును మైసూరులో రెసిడెంటుగారును డార్జిలింగులో గవర్నరుగారును, సెల్యూటులను స్వీకరించిరి. డార్జిలింగులో సెల్యూటుసమయమున టపాసా ప్రేలిన శబ్దము వినపడగా వెంటనే పోలీసులు దగ్గఱనుండు యింటినెల్ల సోదాచేసిరి. అఖరుకు ఎవరో పిల్లలు ఆటలో కాల్చినట్లు స్పష్టమైనది.

---

## విప్లవ కారకులు

డక్కాలో గతశనివారము ఒక యువకుడు అరెస్టుచేయబడెను. ఇతని పట్టుకొనుటకై యిదివరకు యత్నముచేయబడెను. ఆమలకాంతి రాయ్ అధికారులు చెప్పినహద్దులను దాటిపోయినందుకు అతనికి ౬ నెలల విడిశైదు విధింపబడెను. కలకత్తాలో జూను ౬ వ తేది బ్రిటిషు యిండియన్ అసోసియేషనువారు విప్లవోద్యమమును అరికట్టు మార్గముల నాలోచించుటకై సమావేశమైరి. మార్గములను సూచించుటకు ఒక కమిటీ ఏర్పరుచబడెను. అధ్యక్షత వహించిన మిమ్మోల్సింగు మహారాజాగారు దేశములో నిర్మాణ కార్యక్రమము లేనందువలన బాంబులవాతము ఎక్కువైనదనిరి. మరియొక సభ్యుడు ప్రభుత్వమువారికి ప్రజాభిప్రాయముతో గట్టిసంబంధము లేనిది విప్లవాందోళనమును ప్రభుత్వమువారు అణచజాలరనిరి. యూరపియను సంఘాధ్యక్షుడు ఆప్రజాభిప్రాయమును విప్లవాందోళనమును ద్వేషించునట్లు చేయవలెను.

---

## బొంబాయి వ్యాపార రక్షణ

బొంబాయి రేవు వ్యాపారమంతయు కథియవాడ రేవులకు పోవుచున్నదని బొంబాయి ప్రభుత్వము మొఱలను ఆలకించి ఇండియా ప్రభుత్వమువారు బొంబాయిరేవుల వ్యాపారరక్షణకై క్రొత్త పన్ను విధించినారు. ఎమనగా ఇదివరకు రేవుదగ్గర పొందు ౧ ౯ ౬ సాయీలచొప్పున దిగుమతిచేయబడు ప్రతిపై వసూలుచేయబడు సుంకముపోవును. దానిస్థానమున అప్రత్తి నుపయోగించు మిల్లులనుండి అదే రేటుప్రకారము పన్ను వసూలుచేయబడును. కథియవాడ రేవులనుండి వ్యాపారమును తిరిగి బొంబాయికి ఆకర్షించుటకై యీయేర్పాటు చేయబడినది.

---

## హైదరాబాదు
## బజారుధరలు

( కోడూరపు లక్ష్మీనరసయ్య ఉస్మాన్ గంజి )

7—6—1934

| | | | |
|---|---|---|---|
| గోధుమలు:-జెలాల్పు మొదలు పల్లా1కి | | రు12 | 8 |
| బియ్యము:—దొడ్డువి | మొ | 10 | 8 |
| నాణకేసాంబు క్రొత్తవి మొ | | 12 | 0 |
| | వరకు | 12 | 8 |
| డిటో | పాతవి | 13 | 0 |
| | వరకు | 13 | 8 |
| ,, కిచిడిసాంబారులు | క్రొత్తవి,, | 12 | 8 |
| డిటో | పాతవి | 15 | 0 |
| ,, రామసాగరాలు | క్రొత్తవి | 12 | 0 |
| డిటో | పాతవి | 12 | 4 |
| కందులు | పెద్దవి | 10 | 8 |
| | చిన్నవి | 9 | 8 |
| కందిపప్పు | పెద్ద మొ | 14 | 4 |
| | వరకు | | |
| | చిన్నవి | 13 | 4 |
| | వరకు | | |
| పచ్చపెసలు | | 8 | 12 |
| పెసలపప్పు | | 13 | 8 |
| నల్లపెసలు | | 6 | 0 |
| | వరకు | 6 | 8 |
| మినుములు | | 8 | 4 |
| | వరకు | 8 | 8 |
| మినప పప్పు | | 13 | 8 |
| | వరకు | 14 | 0 |
| ఉలవలు | | 4 | 12 |
| | వరకు | 5 | 0 |
| జొన్నలు | | 9 | 4 |
| | వరకు | 9 | 8 |
| శీతసెనగలు | | 12 | 0 |
| పుప్పు | | 12 | 0 |
| తవుడు | | 3 | 0 |
| పత్తిగింజలు | మొ | 6 | 4 |
| అలచందలు | | 9 | 0 |
| అనుములు | | 7 | 0 |
| బటానాలు | | 8 | 0 |
| | వరకు | 8 | 4 |
| బెల్లము | | 19 | 0 |
| ఎఱ్ఱచక్కెర | | 20 | 0 |
| వేరుసెనగ గింజలు చిన్నవి మొ | | 9 | 12 |
| పసుపు | | 14 | 0 |
| మిరపకాయలు | మొదలు ,, | 50 | 0 |
| | వరకు | 60 | 0 |
| చింతపండు | మొ | 7 | 8 |
| | వరకు | 8 | 0 |
| మెంతులు మంచివి 16 సేర్లకు | | 1 | 12 |
| అల్లం 12 సేర్లకు | మొదలు | 1 | 8 |
| వేరుశెనగనూనె | కె 12 కి | 2 | 5 |
| నెయ్యి | కె 40కి | 48 | 0 |
| తెల్లగడ్డలు | మొ కె 12 కి | 2 | |
| ఎఱ్ఱగడ్డలు పల్లా1కి | మొ | 4 | 0 |
| | వరకు | 4 | 8 |
| మద్రాసు చక్కెర | దొడ్డుది | 13 | 8 |
| సెనగలు | మొ | 10 | 12 |
| సెనగపప్పు | మొ | 13 | 8 |
| | వరకు | 13 | 12 |

---

హాలీ కల్దారు మారకము
(సుప్తర్ జి. రఘునాథమల్ బ్యాంకరొట్టు)
7—6—1934.
నూరు కల్దారు రూపాయల కొఱకు
ధర హాలీ రూ ౧౧౬-౮-౦
నూరు కల్దారు రూపాయల అమ్మకపు
ధర హాలీ రూ. ౧౧౬-౩-౦

---

## ప్రకటన

రెడ్డివిద్యార్థులందరకు తెల్యచేయడమేమనగా రెడ్డిజనసంఘము హైద్రాబాదునుంచి ప్రతి సంవత్సరము విద్యార్థివేతనము లొసగబడు ప్రకారం ఈసంవత్సరముకూడ సంఘమునుండివిద్యార్థివేతనములు యివ్వబడును, కనుక విద్యార్థి వేతనములు పొందదలచుకున్న వారు యీదిగువ నిబంధనలు పూర్తి చేయవలయును

1. ఉన్నతవిద్యయందు (మిడిల్ స్కూలు పరీక్షయందు ) ప్యాసుఅయినవారు లేక యింతకంటె యెక్కువతరగతితో ఉత్తీర్ణులైనవారుమాత్రమే దరుఖాస్తులు పంపవలయును, యింతకన్న తక్కువతరగతిలో చదువుకున్న వారల దరఖాస్తులు కమేటీలో ఆమోదించబడవు

2. దరఖాస్తులు పంపువిద్యార్థులు తమతమ దరుఖాస్తులవెంట ప్రోగ్రెస్ రిపోర్టు మరియు హెడ్ మాస్టరు గారియొక్క అభిప్రాయముకూడ పంపవలయును.

3. దరఖాస్తుగుజారు తన బీదతనమునొక్క తస్దీకు తమజిల్లాయొక్క అవ్వల్ తాలూకదారు సా॥ గారితోపొంది దరఖాస్తువెంబడి పంపవలయును. లేక సంఘముమేనేజింగ్ కమేటియొక్క యిద్దరుసభ్యులతస్దీకుచేయించిపంపవలయును.

4 ఇట్టిదరుఖాస్తులు 8 అమర్దాదు 1343 ఫస్లీవరకు సంఘమునకు చేరవలయును.

5. విద్యార్థివేతనముల విషయమై తే 15 అమర్దాదులోపల కమేటి మొకర్రరు అయ్యి కమేటిలో తీర్మానములు కాగలవుకనుక దరుఖాస్తుగుజారులు రెడ్డిజన సంఘముయొక్క ఆఫీసులో తారీఖుకమేటి తెల్సుకొని అట్టికమేటినాడు కమేటీలో హాజరువుండవలయును.

6. గతసంవత్సరము విద్యార్థివేతనములు పొందిన విద్యార్థులుకూడ దరుఖాస్తులు పంపవలయును.

---

## గోలకొండపత్రికా కార్యాలయమున వెలకుదొరుకు గ్రంథములు

| | |
|---|---|
| హిందువుల పండుగలు | 1-8-0 |
| ఉచ్చల విషాదనాటకము | 0-12-0 |
| శిశురక్షణ | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| జీడికంటిరామ శతకము | 0-1-0 |
| బమ్మెరపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| తిప్పన్న చరిత్ర | 0-0-6 |
| రఘునాథ | 0-1-0 |
| చారుమినారు | 0 1-0 |
| పంచముల చరిత్ర | 0 3-0 |
| పాలీకల్దారు జంత్రి | 0-2-0 |
| కొత్త కుబూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రామిసరీనోట్లు ,, | 2-0-0 |

వలయువారు:—

గోలకొండపత్రికాలయము తూప్రుబజారు హైదరాబాదు (దక్కన్)

## వర్తకులకు లాభము

గోలకొండ పత్రికయందు ప్రకటనవేయించి మీవ్యవహారమునందు లాభముపొందుడు. ఈపత్రిక నిజాంరాష్ట్రమునందంతటను బ్రిటిషిండియాయందును విరివిగాప్రచారముచేయుచున్నది. ప్రకటనరేట్ల వివరములకు:— "మేనేజరు గోలకొండపత్రిక" హైదరాబాదు, అని వ్రాయుడు.







REG. No. N. 45 Reg. No. M. 2185

STAMP

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy